# 1

తత్వబోధినీ గ్రంథ[illegible]



# సఘ్యాపష్టసమ్.

ఆమ్నాతిలూపు.

నడదూరు వేంకట రామాచార్య ప్రకటితమ్.

1911.

తత్త్వబోధినీ గ్రంథమాల.




శ్రీవిశ్వక్సేనాయ నమః.

" అహరహస్సన్ధ్యాముపాసీత ."

# సన్ధ్యావన్దనమ్.



బ్రహ్మశ్రీ యలవర్తి ఆంజనేయశాస్త్రిభిః

కృతభాష్యాన్ధ్ర తాత్పర్యబోధినీసమేతమ్

శ్రీయుత నడకుదురు వేంకటరామాచార్యేణ

సుధాపుర్యాం ప్రకటీకృతమ్.

Printed by V. Niranjana Sastri,

AT PRABODHINI PRESS,

DUGGIRALA.

1910

కాపీరైటు. వెల. 0-8-0.

# పీఠిక.

శ్లో॥ యత్సర్వ స్తవనీయపాత్రమస కృద్భక్తానసైకాయతే
త్రయ్యైవాత్ర విహారహారమహదా రామాయతేగాయతే
యన్మారా స్తరసారజా స్తరచలద్రాజన్మరాళాయతే
యత్తన్నా స్తమమేయమచ్యుతమహం సేవేభిరామంమహః

శ్లో॥ యస్సర్వార్థ మహీ సురాళి భవముక్త్యైకైక కర్మాకరోత్
యస్త్రయ్యస్తగతప్రచారసుమనాస్సర్వాగమాభారభృత్
యోవాత్రాఖిలకర్మసంచయఫల ప్రాధాన్యధాతాఽభవత్
తం సన్మార్గవిబోధకం ఋషివరంబోధాయనంభావయే.

తా॥ ఏమహర్షి వేదార్థములయందు సంచరించెడి మనస్సుగల వాఁడై సర్వాగమసంచారుఁడై బ్రాహ్మణులకు ముక్తిప్రదమగు కర్మకాండము నుద్ధరించి కర్మఫలప్రాధాన్యముగు సంధ్యావందన కర్మను గూడ రచియించిన సన్మార్గబోధకుఁడగు నాబోధాయనఋషిని నామనంబున భక్తిపూర్వకముగాఁ దలచుచుంటి,

శ్రీమదఖిలజగదుత్పత్తిస్థితి లయాధినాథ విరాడ వరముఖసం జాతాపఃఘూనఋషిప్రవర పాత్రేణ నిత్యనైమిత్తిక కామ్యకర్మాను

ష్ఠానధురంధరానంద ప్రదానేన విశ్వాకారమహర్షిపుత్రేణ త్రయ్యాగమాన్తం సంచారస్వాంతవిరాజమానేన శ్రీమద్బోధాయ నాచార్యగురువరేణాభిహిత సంధ్యావందనస్య కర్తవ్యతాకానుగత నిత్యానిత్యత్వవిచారః.

తా॥ ప్రపంచాధీశ్వరుఁడగు విరాట్పురుషుని పశ్చిమముఖ సంభవుఁడగు సహభూనఋషి పౌత్రుఁడును విశ్వాకారమహర్షి పుత్రుఁడును కర్మనిష్ఠాగరిష్ఠులకానందప్రదుఁడును, వేదవేదాంగపారంగతుఁడును నగు బోధాయనాచార్య గురువరునిచేఁ జెప్పఁబడిన సంధ్యావందనము యొక్క కర్తవ్యాదివిధి.

తత్రాదావనేన సంధ్యావందనేనకో వా లాభ ఇతిబ్రాహ్మణస్య.

తా॥ ఈ సంధ్యావన్దనమువలన బ్రాహ్మణులకేమి లాభమనిన.

విధ్యుక్తత్వాత్ప్రత్యహం సంధ్యావందనకర్మనైత్యమితి. శ్రుతిః॥ అహరహస్సంధ్యా ముపాసీతేత్యభిహితత్వాత్తస్య ఫలంతుదైవజ్ఞః॥

తా॥ సంధ్యావందనము నిత్యకర్మయని వేదమందుఁజెప్పఁబడుటచేనిది బ్రాహ్మణునికి ముఖ్యమని తెలియుచున్నది. శ్రు॥ అహరహస్సంధ్యాముపాసీత॥ తా॥ ప్రతిదినము సంధ్యనుపాసనజేయదగినదని చెప్పియుండుటచేతను దీనిఫలమునుగురించి దైవజ్ఞమహర్షిగూడ నిట్లుఁ జెప్పియుండె.

శ్లో॥ సర్వసేవ్యమిదంసర్వం మహర్షిభిరుదీరితం
కామ్యంసర్వమిదంకర్మకామస్సంకల్పజస్స్మృతః.

తా॥ మహర్షులచేఁ జెప్పఁబడిన కర్మకాండమంతయు నందఱిచే సేవించఁదగినదనియు, నిది కామ్యకర్మమనియు, కామము సంకల్పము వలన బుట్టునదియనియు.

శ్లో॥ మనస్సంకల్పమాత్రేణఫలేచ్ఛాజాయతే తదా
సమ్యగ్విచార్యకర్తవ్యంకర్మాత్మోపయికంసదా.

తా॥ మనమేవని సంకల్పించినను మనస్సునందు సంకల్పమాత్రమునేతనే ఫలమందిచ్ఛగలుగుచుండును. అట్టిఫలేచ్ఛను భగవంతుఁడు మనలకొసగిన యుక్తాయుక్తవిచారణకారియగు నిర్మలమయిన జ్ఞానముచే బాగుగా విచారించి ఆత్మోపయికం అనగా ఆత్మస్వరూపుడగు భగవంతుని గుర్తుల బోధించుకర్మ. అదియే సర్వసేవ్యమైనదిగాన దానినె సమరసజ్ఞానమునకై యిహపరసాధనమగు నీ సంధ్యావందనమాచరించఁదగినది.

శ్లో॥ ఫలేచ్ఛయాయుతంకర్మ నప్రశస్తంభవేత్పరం
యత్కృతంచాత్మసద్ధర్మంతవోత్కృష్టతుసాధనం.

తా॥ ఫలేచ్ఛతోఁగూడిన కర్మ ప్రశస్తమైనదికాదు అనగా స్వర్గాదిభోగముల నపేక్షించియు ఇహమందు ధన కనక వస్తువాహనములగోరి యొనరించు తపఃకర్మాదులన్నియును యోగ్యములుఁగావని

యు, కేవలాత్మశుద్ధికొరకేయేకర్మలననుష్ఠింతురో యాకర్మలే మోక్ష సాధనములనియు, మోక్షమనగా నంతరాత్మకు వ్యతిరిక్తమగుకర్మల విడుచుట దీనివలననే యోగ్యపదము నధిష్ఠించగలరు. ఇదియే మానవ జన్మమునకు సార్థకము.

శ్లో॥ మనస్సదాచరత్యేవ జడరూపమిదం పరం
లబ్ధుంహిసుఖదుఃఖాదీన్ సాధనంచాంతరింద్రియం.

తా॥ జడరూపమగు నీమనస్సు సర్వకాలములయందును సంచరించుచుండును. ఈయంతరింద్రియమగు మనస్సు సుఖదుఃఖములను బొందుటకు నొక పెద్దసాధనము అనగా సముద్రమునందు నావ మనకెటుల సాధనమగుచున్నదో యటువలెనే భవాబ్ధియందీమనస్సు మనము తరించుటకు సాధనమైయున్నది.

శ్లో॥ తదర్థం నిర్మితం చైతత్కర్మసన్మార్గదాయికమ్
అధఃపాతభయార్తానాం మనోనిగ్రహకారణమ్.

తా॥ దుఃఖములవిడిచి సుఖములఁ బొందుటకుగాను నీసన్మార్గదాయకమగు కర్మకాండము రచియించఁబడినది. నీచమార్గములబడి దుఃఖములబొందుదుమేమో యను భయముగలవారికి మనస్సును స్వాధీనపరుచుకొనుటకు కర్మకాండముగూడ నొకకారణముగనున్నది.

అనేన వేదవేదాంగధర్మజ్ఞా సర్వజనానందప్రదాయక మార్గదర్శనార్థమేవకృతమేతదితి స్పష్టంభవతి॥ అస్మాదేవ॥

శ్లో॥ ధర్మార్థకామయుక్తానాం కర్మైతదుదితం బుధైరితి।
తస్మాద్ధర్మార్థకామయుక్తానా మేవాహింసతాది ధర్మ
జ్ఞాపనార్థమిదంకర్మ.

తా॥ ఇట్లుఁజెప్పుటచే వేదవేదాంగధర్మజ్ఞుల దెలిసిన మహాఋషులు సర్వజనులకానందమొసగు మార్గములఁ జూవగోరియే కర్మకాండమనునది జెప్పియుండిరని స్పష్టమగుచున్నది. అందువలననె, శ్లో॥ ధర్మార్థకామయుక్తానాం కర్మైతదుదితంబుధైరితి॥ తా॥ ధర్మము, అర్థము, కామము, వీటితోగూడియుండువారికీకర్మఁజెప్పబడినదియని జెప్పుటచే ధర్మార్థకామయుక్తులకే యహింసాది ధర్మముల దెలియజేయుటకయి నీకర్మకాండము జెప్పబడియున్నది. అనగా ధర్మమునుగోరి పుత్రమిత్రకళత్రాదులతోనుండి తత్తదుపాధి సాధనమగు ధనము నార్జించునెడ పరులనెప్పుడును హింసించగూడదని మనము దెలిసికొనుటకు హింసయనగా పరులమనస్సును ఖేదమునొందించుట; దీనినే మహాపాతకమని యందురు. ఇట్టిపాపములఁ బొందకుండుటకై మనకు సన్మార్గముల బోధించు కర్మకాండమును బోధించియుండిరి గాన నీసంధ్యావందన కర్మయందె.

శ్రు॥ సూర్యశ్చ మామన్యుశ్చ మన్యుపతయశ్చ
మన్యుకృతేభ్యః పాపేభ్యోరక్షంతామ్.

తా॥ సువతిప్రేరయతీతిసూర్యః షూఞ్ప్రేరణే. లోక చక్షువగు భగవత్స్వరూపమైన సూర్యుఁడునుకోపాధి దేవతయు క్రోధమునకు

కారణభూతులగు రాగద్వేషాద్యభిమానులును రాగద్వేషాదులవలన నేనార్జించిన పాపముల దూరముచేసి నన్ను రక్షింతురుగాక యని ప్రార్థించుటఁజూడ, శ్లో॥ అహింసా క్వైవకోపస్య బ్రహ్మచర్యాదయోమమ లోభస్యపురతః కేమీసత్యాఽస్తేయా పరిగ్రహాః॥ తా॥ కోపమునకు అహింస ఎక్కడ? అనగా కోపముగలవాడు హింసచేయుటకు వెరువడని భావము॥ చెడికోపె, చండత క్రూరకర్మ వర్త్వేనేతిచండాలః॥ అనగా హింసాదిక్రూరకర్మఁజేయువాడు చండాలుడని తాత్పర్యము. కాముని యెదుట బ్రహ్మచర్యాది నియమములెక్కడ? అనగా కామముచే బహ్మచర్యాది నియమములుఁ జెడునని భావము. లోభుని యెదుట సత్యము, అస్తేయము, అపరిగ్రహము లెక్కడ? అనగా లోభగుణము గలవాడు, సత్యముగా సంచరింపవలెననియు దొంగతనముఁ జేయఁగూడదనియు, అసత్పురుషులవద్ద దానముల స్వీకరించఁగూడదనియు తన మనస్సున దలచడని తాత్పర్యము. ఇవి పాపకార్యములుగాన కామాదుల కధిదేవతలు మాచే నీపాపముల జేయించక రక్షింతురుగాక యని ప్రత్యహము ధ్యానించుట.

తస్మాత్సర్వేషాంభగవదాయత్తస్వాంతప్రచా
ర సిధ్యర్థమిదం శ్రుతివిధానేన కర్తవ్యమితిసిద్ధమ్.

తా॥ అందువలన సమస్తమైనవారును భగవంతునియందాసక్తి గలిగి సత్యముగా సంచరించుటకై వేదకర్మలఁ జేయఁదగినదని స్పష్టముగాఁ దెలియుచున్నది, గాన.

శ్లో॥ అఖిలంసమవేక్ష్యేహ తచ్ఛ్రుత్యర్థావబోధకమ్
ధర్మశాస్త్రమిదంజ్ఞాత్వాకుర్యాత్తత్ఫలమశ్నుతే.

తా॥ ఈలోకమందు శ్రుత్యర్థమును బోధించు ధర్మశాస్త్రమంతయు బాగుగా తెలిసికొని అనగా నాచరింపదగు ధర్మముల బాగుగా దెలిసికొని సంధ్యావందనాది కర్మలఁజేసినచో దానిఫలమును బొందుచున్నాడు.

నిరుక్తశ్రు॥ స్థాణురయం భారహారఃకిలాభూత్
అధీత్య వేదంనవిజానాతి యోర్థం
అర్థజ్ఞస్సకలంభద్రమశ్నుతేనాకమేతి
జ్ఞానవిధూతపాప్మా.

తా॥ అధ్యయనముజేసి దానియర్థమును దెలిసికొననివాడు వేదమును నొకవస్తువును మోసికొనిపోవుచుండెడి యొకమొద్దుగానుండును. వేదార్థమును దెలిసికొనినవాడు జ్ఞానముచేపాపములఁబోఁదోలి శుభములకాలవాలమగు స్వర్గమునుబొందును స్వర్గమనగా స్థానమున నివసించునపుడును, ధనమార్జించునపుడును, ఆర్జించినదానిని భుజించునపుడును సత్యమార్గమున బ్రవర్తించుటయే స్వర్గమని భావము-అటువలెనె.

శ్లో॥ వేదంవా ధర్మశాస్త్రంవా కృత్వాధ్యయనమానసతు
తుష్యత్యర్థమజానంస్తం నార్చయేత్సర్వకర్మసు.

శ్లో॥ సంసారార్ణవమగ్నానాం సౌకేవై పానసంశయః
త్రాయతాం నృణామాద్యా విశ్వకర్మాఽసృజద్విభుః

తా. సంసారసముద్రమున మునిగియున్న నరులకు నీసంధ్యావందనము నావవంటిదని నిశ్చయమనుటచే పాపమార్గముల విడచి సన్మార్గములయందు మనము సంచరింపజేయునని భావము. ఇట్టి సర్వదేవతా స్వరూపిణియగు గాయత్రీ మంత్రాధిష్ఠానదేవతను విరాట్పురుషుఁడగు విశ్వకర్మ మానవులు తరించుటకై సృజించినవాఁడని తెలిసికొనదగియున్నది.

శ్లో॥ తస్యామర్ఘ్యప్రదానంచ గాయత్ర్యోపాసనం తథా
సూర్యోపస్థానమేతాని కర్తవ్యాన్యతిభక్తితః.

తా, పైనచెప్పిన సంధ్యాకాలమందు అర్ఘ్యప్రదానమును గాయత్ర్యోపాసనమును సూర్యోపస్థానమును మిక్కిలి భక్తితో నీమూఁడు కర్మలు నాచరింపఁదగినవి,

శ్లో॥ యజ్జలంశుచిపూజార్థం తదర్ఘ్యమితికథ్యతే
త్ర్యష్టవర్ణాత్రిపాదీయా ఋగ్గాయత్రీత్యసౌస్మృతా.

తా. పూజకొరకు పరిశుద్ధమగు జలమర్ఘ్యమనియు, ఇరువదినాలుగక్షరములుగలిగి మూఁడుపాదములుగల ఋక్కు గాయత్రీమంత్రమనియు చెప్పఁబడుచున్నది. గాయత్రి గాయంతంత్రాయతఇతి గాయత్రీ.

తా॥ స్మరించువానిని రక్షించునది, 'గాయత్రీమన్త్రా'ధిష్టాన దేవతను ధ్యానించువారు భవపాశవిముక్తులై సత్పథమును బొందుదురని తాత్పర్యము.

శ్లో॥ సూర్యస్యాభిముఖో తిష్ఠన్ శుచిర్ధ్యానమనాకులమ్
సూర్యోపస్థాన మేతద్ధిబుధైరాచరితంస్మృతమ్.

తా॥ స్నానముచే పరిశుద్ధుఁడై నిర్మలమగు మనస్సుతో అనగా భక్తితో సూర్యునకభిముఖముగానుండి పూర్వము ఋషులచే నాచరింపఁబడినట్టి ధ్యానము సూర్యోపస్థానమని జెప్పఁబడిరి.

శ్లో॥ సంధ్యావందనమే తద్ధిప్రాంచంప్రై నిత్యకర్మణామ్
ఆదావేతద్విహీనేన ప్రాప్నోయాత్యధోగతిమ్.

తా॥ నిత్యకర్మలలో నీసంధ్యావందనకర్మ నాదియందాచరించదగినది. ప్రాతఃకాలమున సంధ్యావందనమాచరించని బ్రాహ్మణుం డధోగతి పాలగును అనగా భగవద్భక్తి గలుగనట్టియు నమరసజ్ఞానమభివృద్ధిజేయు నీసంధ్యావందనమాచరించని మనస్సు నీచకర్మలయందు ప్రవేశించుటచే దుష్కర్మవలన యధోగతిపాలగునని భావము.

శ్లో॥ యేసంధ్యాంనవిదన్తిహాసార్థయుక్తాంసుసేవితాం
తేబ్రాహ్మణాస్తథా జ్ఞేయాస్సర్వకర్మవిదూషితాః

తా॥ ఎవరు సేవించదగిన నీసంధ్యావందనమును జదివి యర్థమును దెలిసికొనరో యాబ్రాహ్మణులు సర్వకర్మఫలదూరులై యపా

మించిన వెనుక రెండుఘడియలన్నర మొదలు అయిదుఘడియలవరకును గౌణకాలమని పేరు. ఈకాలమున సంధ్యావందన మాచరించిన చతుర్థార్ఘ్యప్రదానమున నాకాలాతిక్రమణ దోషము హరించును. పగటియందును రాత్రియందును గౌణకాలాంతమున భోజనవిధి చెప్పబడియుండె.

## ఆచమనవిధి.

శ్లో॥ బ్రాహ్మణో బ్రహ్మతీర్థేన కుర్యాదాచమనంతిధా
కాయేనసౌర వేణాపి నాచామేత్పిత్రృకేణతు.

తా॥ బ్రాహ్మణుడు బ్రహ్మతీర్థముచే నాచమనము చేయదగినది. ఇంక కాయతీర్థమునను, సౌరవతీర్థమును నాచమనము చేయవచ్చుగాని పితృతీర్థములో నాచమనము చేయగూడదు.

శ్లో॥ బ్రాహ్మముంగుష్టమూలంతు కాయంకాసిష్టికంతధా
తర్జన్యంగుష్టయోర్మధ్యే పిత్ర్యమగ్రేతుదైవతమ్.

తా॥ చేతిబొటనవ్రేలి మొదటనుండి వచ్చిన జలమును పానము జేసిన బ్రహ్మతీర్థమనియు, చిటికినవ్రేలు మొదటినుండి వచ్చిన జలము కాయతీర్థమనియు- బొటనవ్రేలునకును- తర్జనవ్రేలునకును మధ్యనుంచి విడుదుజలము పితృతీర్థమనియు వ్రేళ్ల కొనలనుంచి విడుదుజలము దైవతీర్థమనియు తాత్పర్యము.

శ్లో॥ అకాలకృతసంధ్యాయాం తద్దోషహారణాయచ
చతుర్ధార్ఘ్యప్రదానంతు దత్వానిర్దోషతాం వ్రజేత్.

తా॥ సంధ్యావందనమునకు ముఖ్యకాలము నతిక్రమించినచో కూడ తద్దోష పరిహారముకొరకు చతుర్ధార్ఘ్యప్రదానమొనరించిన తత్ఫలము నొందగలడు అనగా నిది భోజనకాలమందే సంధ్యావందనమాచరించువారి విషయమని దెలియనగుచున్నది.

శ్లో॥ విద్వానర్ఘ్యప్రదానంతు సప్రాణాయామపూర్వకమ్
కుర్యాద్జ్ఞానంచసౌఖ్యంచ బలమత్యన్తమశ్నుతే.

తా॥ అర్థమునుగుర్తెరిగిన బ్రాహ్మణుడుప్రాణాయామపూర్వకముగా నర్ఘ్యప్రదానమాచరించినచో జ్ఞానమును మిక్కిలి బలమును సౌఖ్యమునుబొందుచున్నాడు. ప్రాణాయామమనగా.

శ్లో॥ ఇడయావాయుమాపూర్యత్యజేత్పింగళయాతధా
తద్వ్యత్యయేన కర్తవ్యః ప్రాణాయామంవటుర్గృహే.

తా॥ ఎడమవైపు నాసికారంధ్రమున వాయువును లోపలకుబీల్చి కుడిరంధ్రమున వెలుపలకు విడిచిపెట్టుటయు మరలకుడిరంధ్రమున బీల్చి యెడమరంధ్రమున విడుచుటయు నొకప్రాణాయామమనజను.

శ్లో॥ ప్రాణాయామత్రయం కుర్యాత్ప్రాతఃకాలేవటుస్సదా
మధ్యాహ్నేత్రిగుణంప్రోక్తం సాయం పఞ్చగుణంతధా.

తా॥ ప్రాతఃకాలమునందు మూడుమారులును, మధ్యాహ్నకాలమునందు తొమ్మిదిమారులును, సాయంకాలమందు పదిహేనుమారులును సంధ్యావందనమాచరించునపుడు ప్రాణాయామముల నభ్యసించదగినది

శ్లో॥ ప్రాతర్మాధ్యాహ్నయోరప్సుసాయమర్ఘ్యంభువిక్షిపేత్
సాయంతూపవిశన్దద్యాత్ప్రాతఃప్రహ్వోఽభిజిద్ద్యుజః

తా॥ అర్ఘ్యోదకమును ప్రాతఃకాలమునందును మధ్యాహ్నకాలమునందును జలమునందుంచవలయును. సాయంకాలార్ఘ్యమును భూమిపైనుంచదగినది. ప్రాతఃకాలమున కొంచము వంగియును మధ్యాహ్నమున నిలచియు సాయంకాలమున గూర్చుండియు నర్ఘ్యప్రదానమాచరించవలెను.

శ్లో॥ గృహీత్వార్ఘ్యంతుపాణిభ్యాంగాయత్రీంసంస్మరన్బుధః
హృదంతంతు తదుద్ధృత్యక్షిపేదర్ఘ్యం యథావిధిః.

తా॥ విద్వాంసుడు రెండుచేతులతో జలమును గ్రహించి గాయత్రీమంత్రమును స్మరించుచు హృదయమునకు సమముగా జలాంజలినుంచుకొని యథావిధిగా నర్ఘ్యప్రక్షేపణ మొనర్చదగినది.

శ్లో॥ జలాశయస్త్వభావేతు సంధ్యాకాలేతుసువ్రతః
భూమావాజలేనసంప్రోక్ష్యతదర్ఘ్యం తత్రనిక్షిపేత్.

తా॥ ప్రాతర్మాధ్యాహ్నసంధ్యా సమయమందు తటాకాదులు

సమీపమున లేకుండినచో భూమిపై జలమును ప్రోక్షించి యచ్చటనే యర్ఘ్యప్రక్షేపణ మొనర్చనగును.

శ్లో॥ తర్జన్యంగుళ్యసంయోగాద్ద్వ్యాదర్ఘ్యంగృహీవటుః
తద్యోగేరాక్షసీముద్రాతత్తోయంరుధిరంస్మృతమ్,

తా॥ గృహస్థుడును వటువును కూడ నర్ఘ్యప్రక్షేపణ మొనర్చునపుడు బొటనవ్రేలు తర్జనవ్రేలునకు దాకకుండునటుల నుంచదగినది అట్లు తర్జనవ్రేలునకు బొటనవ్రేలు దాకినచో నది రాక్షసీముద్రయగుయు దీనిచే విడువబడు జలము రక్తముతో సమానమనియు జెప్పియుండె.

శ్లో॥ పద్మాసనస్థితోమౌని నిమీలననయనశ్శుచిః
నాసాగ్రపీడనంకుర్యాత్స్వాంగుష్ఠాంగుళిభిరాదరాత్.

తా॥ పద్మాసనస్థుడై అనగా కుడిపాదము నెడమతొడమీదను నెడమపాదము కుడితొడమీదను నుంచి కూర్చుండి పరులతో మాట్లాడక నిర్మలమనస్కుడై నేత్రములమూసికొని కుడిచేతియొక్క యైదు వ్రేళ్లతో నాసాగ్రమును బట్టుకొనవలసినది.

శ్లో॥ కనిష్ఠానామికాంగుష్ఠైర్యతీనాంబ్రహ్మచారిణామ్
నాసాగ్రపీడనంహ్యేషా ముద్రోంకారేతి సంస్మృతా.

తా॥ చిటికెనవ్రేలు దానిదరివ్రేలు బొటనవ్రేలు ఈమూటితో

యతులును, బ్రహ్మచారులును నాసాగ్రమును బట్టుకొనవలయును. ఇది యే ఓంకార ముద్రయని జెప్పబడును.

శ్లో॥ గృహీపఙ్చాఙ్గుళీభిస్తు నాసాగ్రంపీడయేత్సదా
ప్రోక్తైషాప్రణవానామ ముద్రాసర్వఫలప్రదా.

తా॥ గృహస్థుడు కుడిచేతి యైదువ్రేళ్లతోను నాసాగ్రమును బట్టుకొననగు నదియే ప్రణవముద్రయనియు సర్వఫలముల నొసంగుననియు జెప్పియుండె.

శ్లో॥ ఓంకారంసర్వపాపఘ్నమాదావంతేచకర్మసు
స్మరేత్పూర్వకృతంపాపంహంత్యంతే తత్ఫలదం పరమ్.

తా॥ సర్వపాపముల హరించెడి ప్రణవమును సంధ్యావందనాది కర్మలయొక్క యాద్యంతములయందు స్మరించవలయును. ప్రారంభమున స్మరించిన ప్రణవము పూర్వకృతపాపముల హరించును, అంతమున స్మరించిన ప్రణవము తత్కర్మఫలముల నొసగును.

శ్లో॥ ఆచమ్యావసథంవిద్వాన్నిర్మలేనజలేనతు
[illegible]స్తాంగుష్ఠాస్తుదాపస్తానపిసంమృజేత్.

[illegible]సరము బ్రాహ్మణుడు నిర్మలమగు జలముచే [illegible] మొదలు వ్రేళ్లకొనలవరకును రెండుహస్తముల [illegible]కొనవలసినది,

శ్లో॥ అనామికాఙ్గుళీమధ్య పర్వాది క్రమశోజపేత్
తర్జనీమూలపర్యన్తం గాయత్రీం దశపర్వసు.

తా॥ అనామికవ్రేలుయొక్క మధ్యపర్వము మొదలు క్రమముగా తర్జనీవ్రేలు మొదటిపర్వమువరకు నగు పదిపర్వములయందును గాయత్రిని జపించవలసినది. పర్వములనగా వ్రేళ్లయందుండెడి అడ్డ గీతలు, బొటనవ్రేలునకు అంగుష్టమనియు దానిదరివ్రేలునకు తర్జనీయనియు మధ్యమవ్రేలునకు మధ్యమమనియు దానిదరివ్రేలునకు అనామికమనియు చిటికిన వ్రేలునకు కనిష్టయనియు నామములు.

శ్లో॥ మధ్యమాఙ్గుళిమూలేద్వే పర్వణీమేరునామకం
తస్మాత్ప్రదక్షిణేనైవ గణయేద్దశపర్వసు.

తా॥ మధ్యమవ్రేలుయొక్క మొదటిరెండుపర్వములును మేరువునుగా భావించి యామేరువునకు ప్రదక్షిణముగా (అనగా) అనామిక వ్రేలిమధ్య పర్వము, ౧. మొదటిపర్వము, ౨. కనిష్టికవ్రేలి మొదటి పర్వము, ౩. మధ్యపర్వము, ౪. చివరపర్వము, ౫. అనామికవ్రేలి చివర పర్వము, ౬. మధ్యమవ్రేలి చివరపర్వము, ౭. తర్జనవ్రేలి చివర పర్వము, ౮. దానిమధ్యపర్వము, ౯. మొదటిపర్వము, ౧౦. ఈక్రమముగా లెక్కపెట్టుకొనవలసినది.

శ్లో॥ జపమాలాంగృహీత్వావా ప్రాతర్నాభిసమంజపేత్
మధ్యాహ్నేహృదయేసాయం నాసాంతే జపలక్షణం.

తా॥ జపమాలను గ్రహించిగాని వర్వములయందుగాని గాయత్రీజపమాచరించునప్పుడు తనహస్తమును ప్రాతస్సంధ్యయందు నాభితో సమానముగాను మధ్యాహ్నమున హృదయతుల్యముగాను సాయంకాలమున నాసాగ్రసమముగను జపించదగినది.

శ్లో॥ సమాసీనోర్ధ్వవాతిష్ఠ న్గాయత్రీంప్రాఙ్ముఖోజపేత్
సాయంచోదఙ్ముఖోభూత్వా నాన్యథాఫలదాయినీ.

తా॥ గాయత్రీ జపమొనరించునతఁడు ప్రాఙ్ముఖముగానైనను ఉత్తరముఖముగానైనను కూర్చుని లేక నిలచియుండిగాని జపమొనరించవలెను మరియొక విధముగా నొనరించిన నది ఫలదాయినిగాదని చెప్పనొప్పు.

శ్లో॥ గృహీవటుస్సదాదేవీంశతమష్టోత్తరంజపేత్
తస్యాధికసహస్రంతు వానప్రస్థోయతిర్జపేత్.

తా॥ గృహస్థుడును బ్రహ్మచారియు గాయత్రీ మంత్రమును ౧౦౮ మారులు జపియించదగినది. వానప్రస్థుడును యతియును ౧౧౦౮ మారులు జపమొనరించదగినది.

శ్లో॥ శ్రాద్ధానాధ్యాయదర్శేషు బ్రాహ్మణస్తుజపేచ్ఛుచిః
దశసంఖ్యాంతుగాయత్రీం యథావిధిరతన్ద్రితః.

తా॥ బ్రాహ్మణుడు శ్రాద్ధదినములయందును, అనాధ్యాయ దినములయందును దర్శయందును గాయత్రీ మంత్రమును పదిమారులు యథా

విధిగా స్మరించదగినది. ఈచెప్పబడిన దినములయందు కొన్ని కర్మ లధికముగా నుండుటచే పదిమాసలే చాలునని జెప్పియుండె. అతన్నిత్య యనుటవలన నన్యకర్మలవలన నలసియుండుటచే నీపదిపర్యాయము లైనను క్రమముగా జేయదగినదని భావము దోచుచుండె.

శ్లో॥ అనాచమ్యైవ యః కర్మకురుతే నిష్ఫలంహితత్
గోకర్ణాకృతిహస్తే నామలకమాత్రజలంపిబేత్.

తా॥ ఆచమనముజేయక నాచరించుకర్మ నిష్ఫలముగును గాన ఆచమనము జేయునపుడు తనహస్తమును గోవుయొక్క కర్ణాకృతిగానుంచి యందు రేగుబండుమాత్రము ప్రమాణముగల జలమును పానముజేయదగును. ఇది పూర్వఋషుల యాచారము గనుకనే మన మిప్పటికిని ఉద్ధరిణెడు జలముతో నాచమనజేయుచుము. ఆ ఉద్ధరిణెడు జలము రేగుబండుమాత్రమై యుండునని తెలుసుకొనదగినది.

శ్లో॥ స్మృత్వాదౌవిశ్వకర్తారం సానగాదీంస్తతఃపరం
చతుర్వింశతినామాని కేశవాదీనిసంస్మరేత్.

తా॥ సంధ్యావందనప్రారంభమున విశ్వకర్మను ధ్యానించి తద నంతరము సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణ అను నైదుగురు బ్రహ్మఋషుల స్మరించి కేశవాదినామముల స్మరించవలయును. అనగా నీ నామములన్నియు భగవత్సంబంధమైనవని దెలిసికొనదగినది. అందుకు, శ్రుతి॥ యోదేవానాం నామధాపకఏవ॥

తా॥ విరాట్పురుషుడగు విశ్వకర్మ యొక్కఁడే దేవాది సర్వనామములఁ ధరించుచున్నవాఁడై ప్రకాశించుచుండెనని భావము.

శ్లో॥ కేశవాద్యైశ్చతుర్థ్యాంతైస్త్రిభిఃపీత్వాజలంశుచిః.
స్వాహాకారేణయుక్తైశ్చేత్స్మృత్యాచమనమీరితమ్.

తా॥ చిత్తశుద్ధిగలిగి చతుర్థ్యాంతములగు కేశవాది మూఁడు నామములతో స్వాహాకారయుక్తముగా జలపానముఁజేసిన స్మృత్యాచమనమనఁబడును.

శ్లో॥ ఆసనేస్యస్తపాదోవా స్థితఃపద్మాసనేతథా
బహిర్జానుకరోభూత్వా నాచామేత్సర్వదాబుధః.

తా॥ పీటయందు పాదములుంచుకొనియు పద్మాసనమునందుండియు మోకాలికి వెలుపల చేతులనుంచుకొనియు నాచమనము జేయఁగూడదు.

శ్లో॥ ఏవముక్తప్రకారేణ బ్రహ్మచారీ గృహీచతామ్
ధ్యాయేదతంద్రితోసంధ్యాం సర్వకాలేషునిర్మలః.

తా॥ బ్రహ్మచారులును, గృహస్థులును నీచెప్పఁబడిన విధిగా జాగరూకతతో ప్రాతస్సాయంకాలములయందెల్లపుడును సంధ్యావందనము జేయదగినది.

శ్లో॥ ఓంకారమాదిగాయత్రీం త్రిభిర్వ్యాహృతిభిస్సహ
ఉభయోస్సంధ్యయోర్జప్త్వా వేదమూలఫలంలభేత్.

తా॥ ఓంకారమాదియందుంచి పాదరూపములుగానుండు మూడు వ్యాహృతులతో గూడుకొనిన గాయత్రీమంత్రాధిష్ఠానదేవతను ప్రాతస్సాయం సంధ్యలయందు స్మరించినవానికి వేదమూలమగు ఫలము లభించును.

ఇతి శ్రీమద్వ్యలవర్తి ఆంజనేయ శాస్త్రిణా కృతభాష్యానసృతి తాత్పర్యబోధిన్యాసహా సంధ్యావందనవిధిః



శ్రీవిశ్వకర్మణేనమః

# సన్ధ్యావన్దనమ్.

శ్లో॥ యస్స్మరే ద్విశ్వకర్మాణం సానగాది యుతంవిభుం
స్పృష్టిస్థిత్యన్తకర్తారం సబాహ్యాభ్యన్తరశ్శుచిః

ఓం కేశవాయస్వాహా ఓం నారాయణాయస్వాహా ఓం మాధవాయస్వాహా ఓం గోవిందాయనమః విష్ణవేనమః మధుసూదనాయనమః త్రివిక్రమాయనమః వామనాయనమః శ్రీధరాయనమః హృషికేశాయనమః పద్మనాభాయనమః దామోదరాయనమః సఙ్కర్షణాయనమః వాసుదేవాయనమః ప్రద్యుమ్నాయనమః అనిరుద్ధాయనమః పురుషోత్తమాయనమః అధోక్షజాయనమః నారసింహాయనమః అచ్యుతాయనమః ఉపేన్ద్రాయనమః హరయేనమః ఓం శ్రీకృష్ణాయనమః

స్మృత్వాచమనం కృత్వా.

ఉత్తిష్ఠన్తు భూతపిశాచా ఏతే భూమిభారకా
ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే॥

తా॥ భూతపిశాచములు ఇష్టం ప్రాప్నువన్తీతి భూతాః పిశితమశ్నంతీతి పిశాచాః॥ అనగా ధర్మమున గట్టువడక స్వేచ్ఛగా

రుగు మాంసాశనులు సత్పురుషుల హృదయమందు ధరింప శక్యము గానిది యధర్మము. అట్టి యధర్మమును ధరించువారు భూమికి భారకు లు అనగా భూజనుల బాధించువారు వీరితో విరోధము బెట్టుకొనినచో సత్కర్మల జెఱుతురుగాన వారితో విరోధించకయె సంధ్యావన్దన కర్మ ప్రారంభించుచుంటినని భావము. అట్టివారు సంధ్యావందనకా లమందు లేచివెళ్లుదురుగాక యని ప్రార్థన.

ఉత్తిష్ఠన్త్వితి॥ భూమిభారకాః - భూమేః భారం అసుఖం కుర్వన్తీతి భూమిభారకాః భూస్థితజనబాధకా ఇత్యర్థః భూతపిశా చాః- ఇష్టం ప్రాపృన్వన్తీతి భూతాః - పిశితమశ్నంతీతి పిశాచాః ఏతే షామవిరోధేన విరోధరహితేన నతుస్నేహేన బ్రహ్మకర్మ సంధ్యావన్ద నకర్మసమారభే ప్రారభ్యతె కరోమీత్యర్థః- యేయే సత్కర్మవిఘ్న కారిణస్తే ఉత్తిష్ఠన్త్వితి - ప్రార్థనాయాంలోట్.

మూలమ్॥ ఓంభూః ఓంభువః ఓగ్ సువః ఓంమహః ఓంజనః ఓంత

పః ఓగ్ సత్యం ఓంతత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహిధి

యోయోనః ప్రచోదయాత్ ఓమాపోజ్యోతిరసోమృ

తం బ్రహ్మభూర్భువస్సువరోమ్.

తా॥ ఈమన్త్రార్థము ముందు జెప్పబడును.

మమోపాత్తదురితక్షయద్వారా శ్రీపరమేశ్వర ముద్ది శ్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం శ్రీవిరాడ్విశ్వేశ్వకర్మాజ్ఞయా ప్రవర్త

మానస్యాద్యబ్రహ్మణః ద్వితీయప్రహరార్ధే వైవస్వతమన్వన్త
రే కలియుగే ప్రథమపాదే జమ్బూద్వీపే మేరోర్దక్షిణదిగ్భాగే
శ్రీశైలస్యైశాన్యప్రదేశే కృష్ణాకావేర్యోర్మధ్యదేశే సమస్తదే
వతా బ్రాహ్మణసన్నిధౌ అస్మిన్ వర్తమానవ్యావహారిక చా
న్ద్రమానేనసంవత్సరే * అయనే * ఋతౌ * మాసే * పక్షే *
తిథౌ * వాసరే * శుభనక్షత్రే శుభయోగశుభకరణ ఏవంగు
ణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీపరమేశ్వరముద్దిశ్య శ్రీప
రమేశ్వరప్రీత్యర్థం ప్రాతస్సంధ్యాముపాసిష్యే.

మూలమ్. ఆపోహిష్ఠామయోభువస్తానఊర్జేదధాతన
మహేరణాయచక్షసే యోవశ్శివతమోరస
స్తస్యభాజయతేహనః ఉశతీరివమాతరః
తస్మాఅరంగమామవోయస్యక్షయాయజిన్వథ
ఆపోజనయథాచనః.

తా॥ పరమాత్మవలె సర్వమును వ్యాపించిన జలాధిష్ఠాన దేవతనుగూర్చి ధ్యానము. సుఖముల కాలవాలమగు నో యుదకములారా! పైరులను వృద్ధిబొందించి మాకన్నమునొసగుడు. మీరు మాకు తల్లులవలె మిక్కిలి రమణీయములై మాయింద్రియముల నభివృద్ధిబొందుటకు నే యేరసములుగలవో యారసములనొసంగిన మేము సుఖింతుము. అని భూమియందు జలమును విడువవలయును, జలములారా! మమ్ముల సంతానయుక్తులనుగా జేయుడు,

భా॥ ఆపఇతి॥ హే ఆపః ఆపుల్ వ్యాప్తావితి ధాతోరపాం సర్వ స్యావకత్వం యథా పరమాత్మా సర్వవ్యాపీతద్వదేవేత్యర్థః. "ఆపోవా ఇదగ్ సర్వం విశ్వాభూతా న్యాప ఇతి శ్రుతేశ్చ" । హి శబ్దస్త్వవకారార్థః- యూయమేవ- మయోభువః - సుఖప్రదాః సుఖభూమయ ఇతివా స్థ-భవథ దీర్ఘత్వాంచసః-తాః పూర్వోక్తాయూయం,వః, అస్మాన్ ఊర్జే అన్నాయ దధాతన స్థాపయత,అనేన పృథివ్యాః జలసంబంధేనైవ సర్వసస్య సమృద్ధిర్వ్యజ్యతే॥ మహే. మహతే, రణాయ. రమణీయాయ, చక్షసే ఇంద్రియజన్యజ్ఞానాయ, అనేన నతు కేవలమైహికసాధనమన్నమితి, కింత్వింద్రియజన్యజ్ఞానకారణత్వాచ్చ తదధిగమ్యాపరంగమితుమిత్యర్థః॥ వఃయుష్మాకం శివతమః అత్యంతసుఖకరః యోరసః రస్యతే ఆస్వాద్యత ఇతిరసః॥ తస్యతంరసం ద్వితీయార్థే షష్ఠీతిబోధ్యం ఇహ అస్మిన్ లోకేనః అస్మాన్ జనయథ అన్నాదింద్రియపుష్టికరం రసం ప్రాపయతేత్యర్థః। ఉశతీః ప్రేమయుక్తాః ప్రథమార్థే ద్వితీయావిభక్తిశ్ఛాందసీ మాతరఇవ యథాస్తన్యరసేన మాతరః పుత్రాన్రక్షన్తి తద్వదేవేత్యర్థః॥ యస్యరసస్యక్షయాయ క్షిత్యా తృతీయార్థే చతుర్థీవిభక్తిః జిన్వథ యూయముల్లసథ॥ తస్మైరసాయనః యుష్మాకం అరం భృశం గమామ, గచ్ఛేమ- అనేనభూమౌ జలంసిక్త్వేత్ హే ఆప ; హే సర్వలోకముఖాని నః అస్మాన్ జనయథ, యథాసన్తానవన్తో భవిష్యామ స్తథా కురుతేత్యర్థః.

<u>మూలమ్.</u> సూర్యశ్చమామన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతే
భ్యః పాపేభ్యోరక్షన్తామ్ యద్రాత్ర్యా పాపమకార్షం

మనసావాచాహస్తాభ్యాం పద్భ్యాముదరేణశిశ్నా
రాత్రి స్తదవలుమ్పతు యత్కించదురితం మయి
ఇదమహంమా మమృతయోనౌసూర్యేజ్యోతిషి
జుహోమిస్వాహా.

తా॥ మనమనస్సును సత్కర్మలయందు ప్రవేశపెట్టు పరమాత్ముడగు సూర్యుడును, క్రోధమును(అనగా) ఓకోపమా నాచే హింసాది కర్మల జేయించకమనిభావము. క్రోధాధిపతులగు రాగద్వేషాదులు. అసత్కర్మలయందు మమ్ముల ప్రేరేపించక పాపమార్గము దొలగించి రక్షింతురుగాక. రాత్రియందు తెలియక మనస్సుచేతను (అనగా) పరపీడనమూహించుట, మనస్సువలన గలిగెడిదోషము. వాచాదోషమనృతము నితరుల దూషించుటయును మొదలగునవి చోరత్వముచే పరధనమును స్వీకరించుట హస్తమువలన గలిగినదోషము, పితృలు మొదలగు పూజ్యులకు పాదములు దాకుట పాదకృతమగు దోషము, మధుమాంసాదుల భక్షించుట ఉదరకృతదోషము, పరస్త్రీగమనము మొదలగువాటినన్నిటిని రాత్ర్యాధిష్టానదేవతరా, యా పుమాపుగాక. ఇంక నేనైన పాపములుండినచో వాటినన్నిటిని నేను నాయహంకారమును అమృతకారణస్వయంప్రకాశజ్యోతిస్వరూపమునందు హోమముజేయుచున్నాను స్వాహా అని ప్రాతఃకాలమున జలపానము జేయునది.

భా॥ సూర్యశ్చేతి॥ సువతిప్రేరయతి వ్యాపారేష్వితి సూర్యః

షూఞ్ ప్రేరణె భగవాన్సూర్యః మన్యుః క్రోధః మన్యుపతయః క్రోధ
స్వామినః రాగద్వేషాదయ ఇతివా మన్యుకృతేభ్యః మన్యునా క్రోధే
నర్యాయె పాపాః కృతాస్తేభ్యః మామాం రక్షంతాం ప్రార్థనాయాం
లోట్ మాం పాపేభ్యః పాలయన్త్విత్యర్థః రాత్ర్యా అతీతేన రాత్రి
భాగేన యత్పాప మకార్షం అకరవం మనసా పరోత్కృష్టాసహాన
త్వం మానసికం పాపమితి వాచాపాప మనృతం హస్తాభ్యాం చౌ
ర్యేణ పరద్రవ్యాకర్షణం హస్తకృతం పాపం పద్భ్యాం పదస్పర్శనం
పాదకృతం అభక్ష్యభక్షణ ముదరకృతం మధుమాంసాదికం శిశ్నా
గుహ్యాంగేన పరస్త్రీగమనాదికం యద్యత్పాపం కృతం తత్సర్వం
రాత్రి స్తదవలుంపతు రాత్ర్యభిమానదేవతా అవలుంపతుహరతు కించ
మయి యత్కించిద్దురితంతదిదంసర్వం మామహంభావత్వంచ అహం
సూర్యే భగవతి అమృతయోనౌ జగత్కారణస్వరూపె జ్యోతిషిస్వ
యం ప్రకాశె జుహోమి ప్రక్షిపామి భస్మీకరోమీత్యర్థః తదభిమంత్రి
త జలం స్వాహేతి పిబేత్,

## మధ్యాహ్నకాల,

మూలమ్॥ ఆపఃపునన్తుపృథ్వీం పృథివీపూతాపునాతుమాం
పునన్తుబ్రహ్మణస్పతిర్బ్రహ్మపూతా పునాతుమాం
యదుచి [illegible] మభోజ్యంయద్వాదుశ్చరితంమమసర్వం
[illegible] ాపో సతాంచ ప్రతిగ్రహాగ్ స్వాహా॥

తా॥ ఆపశ్శబ్దవాచ్యుడగు పరమాత్మ అనగా సర్వవ్యాపకుండగు విష్ణువు ఆపోవా ఇదగ్ం సర్వమితి శ్రుతేః॥ తా॥ యీప్రపంచ స్వరూపమంతయు ఆపః అనగా ఉదకముల కధిష్ఠాన దేవతయగు విష్ణువని భావము. అట్టి పరమాత్మ భూమిని పరిశుద్ధి జేయుగాక భూమి పరిశుద్ధురాలై నన్ను పరిశుద్ధుని జేయుగాక యని ప్రార్థన అనగా భూమ్యధిష్ఠాన దేవత నన్ను పాపకృత్యములఁ బోల్పడనీక పవిత్రమార్గముల నుంచుగాక యని భావము. వేదపురుషుడు నన్ను పవిత్రుని జేయుగాక విరాట్పురుషునిచే పవిత్రమైన జలములు నన్ను పవిత్రుని జేయుగాక. ఉచ్ఛిష్టాన్నము భుజించుటయు కీటకాది దుష్టమగు పదార్థముల భుజించుటయు అగమ్యాగమనాదికమును అసత్పురుషుల ప్రతిగ్రహము మొదలగు సపాపములఁ దెలియక నేనాచరించితినో యాపాపములను నీయుదకాధిష్ఠాన దేవతయగు పరమాత్మ నాపుమాపి నన్ను పవిత్రుని జేయుగాక స్వాహా అని జలపానము చేయునది.

భా॥ ఆపః పునన్త్వితి॥ ఆపః వక్ష్యోదకాని పృథివీం పునంతు అపుల్ వ్యాప్తా వితి సర్వవ్యాపకో విష్ణుః తథా॥ శ్రు॥ ఆపోవా ఇదగ్ం సర్వమితి శ్రుతేశ్చ అపశ్శబ్దవాచ్యో శ్రీ మహావిష్ణు రాపస్స్వరూపేణ పృథివీం పునన్త్విత్యర్థః సాపృథివీపూతామా మనుష్ఠాతారం పునాతు సౌభాగ్యకర్త్రాధికారిణం కరోత్విత్యర్థః బ్రహ్మణస్పతిర్వేద స్తేపో మాం పునాతు బ్రహ్మపూతా ఆపః మాం పునాతు పునన్తు పురుషవ్యత్య

యశ్ఛాందసః యదుచ్ఛిష్టం పరభుక్తావశిష్టం అభోజ్యం భోజనాన్నం కేశకీటమధుమాంసాదిమిశ్రితం దుశ్చరితంఅగమ్యాగమనాదికం అసతాం క్రూరకర్మిణాం ప్రతిగ్రహాదిక మజ్ఞానకృతం యద్యత్పాపం మమ తత్సర్వమపనుద్యఆపః తదధిష్టావదేతా విష్ణురితి భావః మాంపునన్తు తదభిమంత్రితజలం స్వాహేత్యాదరాగ్నౌ సుహుతమస్త్విత్యర్థః పిబేత్.

## సాయంకాలే.

మూలమ్॥ అగ్నిశ్చ మామన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః పాపేభ్యో రక్షన్తామ్। యదహ్నాపాపమకార్షం మనసా వాచాహస్తాభ్యాం। పద్భ్యాముదరేణ శిశ్నా। అహ స్తదవలుమ్పతు।యత్కించ దురితంమయి ఇదమహంమామమృతయోనౌ సత్యే జ్యోతిషిజుహోమిస్వాహా॥

తా॥ హృదంతరాళమున నగ్నిరూపముతో నుండు పరమాత్మ నన్ను రక్షించుగాక అగ్నియనగా భుజించు పదార్థముల జీర్ణింపఁజేసి యింద్రియములకు పుష్టినొసంగునది. దీనివలననే సర్వప్రాణులు జీవించుటకు కారణమగుచున్నది. శ్రు॥ ప్రజాపతిశ్చరతిగర్భే అన్తః

తా॥ భగవంతుడు గర్భములో సంచరించుచుండెనని యుం జెప్పి

యుండె నది యగ్నియని భావము. మిగిలిన మంత్రార్థము సూర్య శ్చయను మంత్రమువలన 'దెలియుచున్నది.

భా॥ అగ్నిరితి ॥ అగతికుటిలం ఊర్ధ్వంవా గచ్ఛతీత్యగ్నిః అగకుటిలాయాంగతౌ ఊర్ధ్వపార్శ్వాధోగామ్యయం సర్వవ్యాపీత్యర్థః ఔదర్యాగ్నేస్సర్వవ్యాపకత్వమితి తదధిష్ఠానదేవతా పరమాత్మా ప్రజాపతిశ్చరతిగర్భే అంతరితి శ్రుతేశ్చ తాదృశః పరమాత్మ స్వరూపోఽగ్నిస్సర్వజీవాంతర్యామిత్వేన చరతీత్యర్థః - తస్మిన్పరమాత్మని మమ్ఋతపావం జుహోమి నివేద్య భస్మీకరోమీత్యర్థః - స్వాహా సుహుతమస్తు - సాయం జలపానమంత్రమేతచ్చేషః సూర్యశ్చేతిమంత్రేణైవోక్తం.

ఆచమ్య.

మూలమ్॥ దధిక్రావ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః
సురభినో ముఖాకరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్.

తా॥ జగజ్జేతృండైనట్టియు సర్వవ్యాపకుండును సర్వజీవాన్తర్గతుం డునునై : అగ్నియె ముఖముగాగల హవిర్భుండు, అనగా సర్వపదార్థములను తనయందు లీనముజేసుకొను పరమాత్మసంబంధమైన స్తోత్రమును జేయుచుంటిగాన మాముఖములను పరిమళముగల వాటినిగాం జేయుగాక అనగా సత్ఫలములతో గూడునటులం జేయుగాక యని భావము. మాజీవితకాలమును వృద్ధింపుగాక అనగా భగవత్ప్రార్థనాభిలాషులకా యానందప్రాప్తివరకు జీవితకాలమొసంగుగాక యని భావము. ఈ మంత్రాన్తమున మార్జనముజేయునది.

భా॥ జిష్ణోర్జగజ్జైతుః జిజయె అశ్వస్య - సర్వవ్యాపకస్య, ఆశూ వ్యాప్తే-వాజినః, సర్వగతిస్య - వజగితౌ, దధిక్రావ్ణః - హవిర్భక్ దధిక్రావన్ శబ్దోనాన్తః రేఫపూర్వత్వాన్న కారస్యణకారః. తస్య దధిక్రావ్ణః తత్సంబంధిస్తోత్రమకారిషం, కుర్యాం - దేవోపరి ఇకారశ్ఛాందసః, దధయాపిః క్రామతిగచ్ఛతీతి దధిక్రావా సపరమాత్మా నః అస్మాకం ముఖాముఖాని, సురభి, సురభీణి, పరిమళయుక్తాని, సత్ప్ర-యోస్థానాని, కరత్ కరోతు నః అస్మాకమాయూంషి ప్రత్యాయుః ప్రగతా, జీవితకాలాన్ ప్రతారిషత్ వర్ధయతు తత్త్వదర్శనపర్యంతమస్మదాయూంషి వర్ధయతేత్యర్థః॥ అన్యథా జన్మవైఫల్యాదాయుర్వృద్ధిమిచ్ఛత్యర్థః ఆత్మానుసంధానం కర్తవ్యం నత్వాదో.

శ్లో॥ అష్టాక్షరం నవపదంపదాన్తే ప్రతి.పేజ్జలం అశ్వమేధఫ
అంలబ్ధ్వా మనశ్శుద్ధిమవాప్నుయాత్॥

మూలమ్. హిరణ్యవర్ణాశ్శుచయః పావకా యాసుజాతః కశ్యపోయాస్విన్ద్రః। అగ్నింయాగర్భందధిరే విరూపాస్తా న ఆపశ్శగ్గ్ స్యోనా భవన్తు.

తా॥ ప్రాతస్సాయంసంధ్యాకాలములయందు బంగారుచాయ గలిగినట్టియు స్నానపానాదులచే నందరను పవిత్రుల జేయుచున్నట్టియున్నట్టియుదకములయందు సానగపుత్రుండగు కశ్యపప్రజాపతి యుద్భవించెనో, అనగా ప్రాక్సముద్రతీరమున కశ్యపప్రజాపతి యుద్భవిం

చేసని భావము, లేక కశ్యపయనునది పశ్యకుడని జెప్పకొనినచో ప్రాతఃకాలమున సూర్యుడు సముద్రములోనుదయించుచున్నట్లు దోచుచుండును. ఏయుదకములమధ్యనుండునా కలంకయందు అనగా ప్రాక్సముద్రమధ్యయందు అస్త్రైశ్వర్యసంపన్నుడైన ఇంద్రుడుద్భవించెనో, ఏవి బడబాగ్నిని గర్భమునందు ధరించెనో. అనేక రసరూపములగు నాయుదకములు అనగా జలాధిష్ఠాన దేవతయగు పరమాత్మయని భావము. మాదుఃఖములబోగొట్టి సుఖములనొసంగుగాక.

భా॥ హిరణ్యవర్ణాః సువర్ణనికాశాః, ప్రాతఃస్సాయంసంధ్యాకాలేషు సూర్యకిరణప్రసారణాదేవందృశ్యంత ఇత్యర్థః- శుచయః అత్యన్తపరిశుద్ధాః పావకాః పవిత్రీకరణసమర్థాః- సర్వేషామవగాహనాద్యర్థినాం శుద్ధిమాపాదయంతీత్యర్థః - యాసు అపః - యాసు అప్సు కశ్యపః, సనకపుత్రః కశ్యపప్రజాపతిః ప్రాక్సముద్రేరిరె జాతఇతిప్రసిద్ధిః - అన్యథావర్ణవ్యత్యయేన పశ్యకః సర్వసాక్షీసూర్యః జాతః ఆవిరభూత్ - తద్వద్రష్టృభిరనుమీయత ఇత్యర్థః - యాస్వప్సు సురపతిస్థాపః ప్రాక్సముద్రే కాచిల్లంకా తత్రాయమింద్రోపి జాతఇతిభావః. యాః అపః అగ్నింబడబానలంగర్భందధిరె, గర్భేశిశుమివ పిప్రధిత్యర్థః అగ్నేస్సర్వాన్తర్యామిత్వం ప్రసిద్ధం తద్వత్ విరూపాః నానారూపాః, కారణగుణాః కార్యే సంక్రామన్తీతి న్యాయాత్ అగ్నేరాప ఇతి శ్రుతేశ్చ సలిలపుష్పగన్ధాదిభేదేన నానారూపత్వమితి భావః. తాః అపః న అస్మాకం తదధిష్ఠానదేవతేత్యర్థః శం. ఇహ సుఖం స్యోనాః అప్రైషయాతే

సుఖదా భవన్తు అన్యథా శం, దుఃఖశమనం కృత్వా స్యోనాః సుఖప్రదా భవన్తు.

మూలమ్. యాసాగ్ం రాజా వరుణో యాతిమధ్యే సత్యానృతే
అవపశ్యఞ్ జనానామ్ మధుశ్చ్యుతశ్శుచయో యాః
పావకాస్తాన ఆపశ్శగ్ం స్యోనా భవన్తు॥

తా॥ ఏయుదకముల మధ్యయందు పశ్చిమ దిక్కునకు రాజగు వరుణుడు జనులయొక్క సత్యాసత్యంబులగను గొనుచుబోవుచుండునో ఇందువలన పూర్వము పశ్చిమసముద్రమునందు వరుణుడు నావికాయాత్ర సలుపుచు ఇతను రాజగుటచే తత్తీరవాసులను న్యాయముగా బరిపాలించుటవలన నిట్లు వర్ణించబడెనని తెలియుచుండె. ఏవి మధురరసములనొసంగునో ఏవి పరిశుద్ధములై యితరులకు బరిశుద్ధిజేయునో యాయుదకములు మాకు సుఖములనొసంగుగాక

భా॥ యాసామపాంమధ్యే రాజా వరుణః పశ్చిమదిగధిపో జనానాం సత్యానృతే. యథార్థాఽయథార్థే అవపశ్యన్ వివేచయన్ యాతి ప్రజతి, అనేన పురాకిల నావికా యాత్రానుకూల సామగ్ర్యాఽయం వరుణస్తత్తీరవాసినా మర్త్యస్తవాత్సల్యేన పాలయామాసేతి తత్కృతశ్లాఘాసూచనార్థముపవర్ణితోఽయమితి ప్రతీయతాం మధూనిచ్యోతన్తీతి మధుశ్చ్యుతః ద్యుతిర్ అసేచనే శుచయః స్వతశ్శుద్ధయః పావకాశ్చాఽన్యపావనసామర్థ్యాః యాః ఆపః శాః, నః, అస్మాకం, శం, స్యోనాః భవన్తు.

మూలమ్. యాసాందేవా దివికృణ్వన్తి భక్షం యా అన్తరిక్షే
బహుధాభవన్తి యాః పృథివీం పయసోన్దన్తి
శుక్రాస్తాన ఆపశ్శగ్ స్యోనాభవన్తు.

తా॥ స్వర్గమునందు దేవతలు ఏయుదకములను పానముచేయు చుండిరో ఏవి మేఘమండలమునుంచి ధారారూపముగా ననేకములై భూమిని తడిపి శాంతించుచున్నవో అనగా భూతకోటికి హితవగు సస్యములు ఫలించునటుల తడుపుచున్నవని భావము. అట్టి స్వచ్ఛమగు జలములు నాకు సుఖములు నొసంగి రక్షించుగాక.

భా॥ దేవాఃదీవ్యన్తీతి దేవాః దివ్ క్రీడాదౌ అసురాః- దివిద్యులోకే యాసామపాంభక్షంభక్షణం కృణ్వన్తి కుర్వన్తి పురాహిమాలయస్యోత్తరదేశే తేజోపురమితి జనస్థానమస్తితత్రస్థా ఏవ దేవాఇతి తదేవస్వర్ధతిఘణ్టితె గంగాజలసమీపె చరన్తస్తజ్జలమపిబన్నిత్యర్థః యాః అన్తరిక్షే బహుధావర్షరూపేణేత్యర్థః భవన్తియాః పృథివీంపయసా వృష్ట్యా ఉదన్తిక్లేదయన్తి జీవిజీవనార్థమిత్యర్థః శుక్రాఃస్వచ్ఛతరాః తాఃఆపఃనః శంస్యోనాఃభవన్తు.

మూలమ్. శివేసమాచక్షుషా పశ్యతాఽపఽశ్శివయాతను
వోపస్పృశతత్వచమ్మేసర్వాగ్ అగ్నీగ్ రప్సుషదో
హువేవో మయి వర్చోబల మోజోనిధత్తద్రపదా
దివ ముఞ్చతు.

తా॥ ఓజలములారా ! అనగా తదధిష్ఠానదేవతయగు విష్ణుస్వభావము కరుణాకటాక్షవీక్షణముచే నన్ను జూతురుగాక. మంగళప్రదముగు మీశరీరముతో నాశరీరమును స్పృశించి పవిత్రునిజేయుదురుగాక. ఓజలములారా మీమధ్యనుండు బడబానలము మొదలగు సమస్తగుణ అనగా పరివారసమేతముగు తదధిష్ఠానదేవుని యనిభావము ధ్యానించుచున్నాను. ఎందుకనగా, నాయందు దీప్తిని బలమును ఉత్సాహమును దిరముగా నుంతురుగాక యని పావనిర్గమము కొరకు దక్షిణహస్తముతో కొంచము జలము నాసికాగ్రమువరకు నెత్తి వాముభాగమున విడచి నాజలమును జూడకయుండునది.

భా॥ హేఆపః తదధిష్ఠానదేవస్సనాతనో విష్ణురితిభావః శివేన, మంగళప్రదేన చక్షుషా అపాంగేన- మా-మాం-పశ్యత, కరుణాకటాక్షవీక్షణేన మాంపశ్యతఇత్యర్థః - శివయాశుభప్రదయాతనువా, మూర్త్యా, మె, మమ, త్వచం, చర్మ, దేహమితిభావః, ఉపస్పృశత, మాముపస్పృశ్య పవిత్రంకురుతేతిభావః, వః, యుష్మాకం, అప్సుషదః అప్సుసీదన్తి వర్తన్తఇతి. సర్వానగ్నీన్ బాడబాదీన్ పరివారసమేతదదధిష్ఠానదేవతామిత్యర్థః, హువె, ఆగచ్ఛతేతిధ్యాయామి కిమనేనేత్యతఆహ, మయి, స్వస్మిన్, వర్చః - దీప్తిః బలం, శక్తిః, ఓజః ఉత్సాహం ధత్త - స్థాపయత వర్చః - బలం ఓజశ్చత్రీణ్యేతాన్యపి మయియదా సదావాసం కరిష్యంతి తథాకురుతేత్యర్థః పావనిర్గమనాయ దక్షకరే జలంనాసికాస్తముధృత్య వామభాగే నిక్షిప్యతన్నావలోకయేత్.

మూలమ్. ద్రుపదాదివముఞ్చతు ద్రుపదాదివేన్ముముచానః। స్విన్నః స్నాత్వీ మలాదివ। పూతం పవిత్రేణేవాజ్యం ఆపశ్శున్ధన్తు మైనసః.

తా॥ గ్రామణివలన దయతో బొంకకొయ్యనుండి విడుదలచేసిన యపరాధివలెను, దేహము చెమర్చినందున స్నానముజేసి శరీరపంకమువలన పరిశుద్ధుడైన వానివలెను, దర్భముచే పవిత్రమైన ఆజ్యాదిహవిస్సువలెను, భగవంతుడు నన్ను పాపమువలన తొలగించి పవిత్రుని జేయుగాక.

భా॥ ద్రుపదాత్ - అపరాధిపాదఘటితదారువిశేషః, గ్రామణీశ్చోరం సద్గ్రామ్యాత్త్యైపురుషప్రమాణదారుపాదకీలితం విహాయ - స్థాపయతీతి ప్రసిద్ధం తస్మాద్ద్రుపదాత్ - ఉన్ముముచానః తద్దయాయుత యూధివ సద్బంధనాద్యథా మోచయతి తద్వదిత్యర్థః స్విన్నః స్వేదయుక్తః స్నాత్వీ స్నాత్వా మలాత్ స్వశరీరపంకాదివ పవిత్రేణ దర్భాగ్రేణ పూతం పవిత్రం అజ్యం హవిరివ అపః భగవానితి భావః - మాం ఏనసః - పాపాత్ శున్ధన్తు పవిత్రీకుర్వన్తు శోధయన్త్విత్యర్థః.

మూలమ్. హంసశ్శుచిషద్వసురన్తరిక్షసద్ధోతా వేదిషదతిథిర్దురోణసత్ । నృషద్వరసదృతసద్వ్యోమసదబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతంబృహత్.

రించి మూడర్ఘ్యప్రదానములు చేయవలయును. కాలమతిక్ర మించినచో చతుర్థార్ఘ్యప్రదానమాచరించునది. ఇట్టి అర్ఘ్యప్ర దానమొనరించుట భగవత్ప్రీతికొరకని తెలిసికొనదగినది.

మూ॥ మ. ఉద్యన్తమస్తంయన్తమాదిత్యమభిధ్యాయ
న్కుర్వన్బ్రాహ్మణో విద్వాన్ సకలం
భద్రమశ్నుతేఽసావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవసన్
బ్రహ్మాప్యేతి య ఏవం వేద.

తా॥ పూర్వదిక్కునందు ఉదయించి పశ్చిమంబున అస్తమించు చున్న జ్యోతిస్వరూపమగు నాదిత్యునిగూర్చి అనగా భూచక్రము గారే మునకు బల గాన్పించుచుండుటయేగాని సూర్యబింబముదయించుటయు లేదని తెలిసికొనదగును అభిముఖముగానుండి ప్రాతస్సాయంకాల ములయందు నిర్మలచిత్తుడై ధ్యానించు బ్రాహ్మణుడు సకలశుభముల బొందును. ఈ జ్యోతిస్వరూపుడగు సూర్యుని బ్రహ్మస్వరూపమునుగా భావించు బ్రాహ్మణుడు భూలోకమున బ్రహ్మస్వరూపుడై దేహావసాన మందు పరబ్రహ్మమును పొందును. అనగా సమస్తమును బ్రహ్మస్వ రూపమునుగా దలచువాడిహపరసాధనముల బొందునని భావము.

తా॥ ఏకత్వసంప్రాప్త్యానుష్ఠితం అస్తం, అవాచ్యామస్తంగతం భూచక్రముకాద పరభాగస్థ ఇత్యర్థః యం, తం, ఆదిత్యం, సూర్యం,

ఇత్యుపనిషత్॥ అగ్నిర్దేవతా, అన్యమన్త్రాధి దేవతాఽగ్నిః అగ్నేస్సర్వ భూతసంచారత్వాత్ పరమాత్మైక్యోక్తం॥ మహాదేవోమర్త్యాన్ ఆవివేశ ఇతిశ్రుతేః ఋషిః, జ్ఞానస్యపారగమాదృష్టిః ఋ-గతౌ, బ్రహ్మ॥ శివకేశవాదయః పశ్చాదగాస్సమాజాయన్త రౌద్రం, వైష్ణవ, ఋషి దేవ, ఆదిత్యాఖ్యాఇత్యుపనిషత్ప్రమాణ్యాత్, తత్సంబంధి అర్షమితి॥ ఛందః గాయత్రీ గాయన్తంభక్తం త్రాయతఇతి గాయత్రీ త్రైజ్ పాలనే, స్వరూపం పరమాత్మా॥ పరమాత్మసంబంధిస్వస్వరూపం యదస్తితి దేవరూపమితి భావః, సాయుజ్యం వినియోగం, నితరాం యోగం నియోగం విశేషేణ నియోగం వినియోగం బ్రహ్మైక్యసంధానమిత్యర్థః ఏతేన ఫలం సాయుజ్యం, మోక్షం యుజ్యతఇతియోగః యుజిర్ యోగే, అఖండానంద ప్రాప్తిరిత్యర్థః.

**మూలమ్,** ఆయాతువరదాదేవీ అక్షరం బ్రహ్మసమ్మితం
గాయత్రీం ఛందసాం మాతేదం బ్రహ్మజుషస్వమే.

తా॥ భక్తాభీష్టఫలప్రదాయిని యగు దేవివచ్చుగాక అనగా మాకుదర్శనమిచ్చి వరంబులొసంగుగాక యని భావము. త్రిష్టుబాదిఛందస్సులకు మాతృదేవతయగునో గాయత్రీ వేదాన్త వేద్యమగు నాశనరహితమైన బ్రహ్మతత్వమును మాకుపదేశించుము.

భా॥ వరదా భక్తాభీష్టఫలప్రదాయినీ దేవి, దీవ్యతీతి దేవీ, దివ్ క్రీడాదౌ, ఆయాతు, వరప్రదానాయ మత్సకాశమాయాత్విత్యర్థః

అక్షరం నాశనరహితం సమ్మితంవేదప్రమాణేన నిశ్చితం, బ్రహ్మవర మాత్మతత్వం, అన్యథా బ్రహ్మసమ్మితం వేదప్రతిపాదితంవస్తు ఉపదేశాయేతి పూర్వేణాన్వయః, ఛందసాం త్రిష్టుబాది ఛందసాంమాతా-తదధిష్ఠాన దేవతేత్యర్థః గాయత్రీం గాయత్రి ప్రథమా ద్ద్వితీయావిభక్తిశ్చాందసీ, ఇదంవక్ష్యమాణం పరబ్రహ్మతత్వంమె మ, మమ, జుషస్వ జోషయతు ఉపదిశద్విత్యర్థః.

మూలమ్. యదహ్నాత్ కురుతేపాపం తదహ్నాత్ప్రతిముచ్యతే
యద్రాత్రియాత్కురుతేపాపం తద్రాత్రియాత్ప్రతి
ముచ్యతె। సర్వవర్ణేమహాదేవిసంధ్యావిద్యేసరస్వతి.

తా॥ జగద్వ్యాపినైై మిక్కిలి ప్రకాశించు సంధ్యావిద్యవగు నో సరస్వతీ పగటియందు తెలియక నేనొనరించిన పాపములు నీయుపాసన జేయుటవలన పగటియందే నశించుగాక. రాత్రియందొనరించిన పాపములు రాత్రియందేనశించుగాక. అనగా నాపాపములంబోలి నత్యమార్గములయందు నంచరించునటులంజేయుమని భావము.

భా॥ అహ్నాత్ అహనియత్పాపంకురుతెకోపి తత్పాపంఅహ్నాత్ తనహస్యేవప్రతిముచ్యతే ఉపాసకస్యేతిశేషః, ఏతత్త్వదుపాసనాత్పూర్వకృతంపాపం నాశయిత్విత్యర్థః-తథా రాత్రా పాపియత్పాపంకురుతె తత్సర్వం రాత్రావేవప్రతిముచ్యతె, రాత్రికృతంపాపం ప్రాతరుపాసనాదేవ హానత్వితిభావః॥ హె, సర్వవర్ణె నానావర్ణైర్జగద్వ్యాపినీ

త్యర్థః, మహాదేవీ స్వయంప్రకాశిని సంధ్యానం ధ్యాకాలాధి దేవతా
త్వం. హే, విద్యే, జ్ఞానస్వరూపిణీ, హే సరస్వతి సర్వప్రసరణం సర్వ
ప్రాప్తి సరస్వతి హే సర్వవ్యాపినీత్యర్థః

మంత్రమ్. ఓజోఽసి, సహోఽసి, బలమసి, భ్రాజోఽసి,
దేవానాం ధామనామాఽసి, విశ్వమసి, విశ్వాయు
స్సర్వమసి సర్వాయురభిభూరోమ్ గాయత్రీ
మావాహయామి, సావిత్రీమావాహయామి,
సరస్వతీమావాహయామి, ఛన్దఋషీనావాహయా
మి శ్రియమావాహయామి.

తా॥ అన్తరింద్రియ శక్తిరూపమైనట్టియు, సర్వశత్రు నిరసన రూపమైనట్టియు వేగరూపమైనట్టియు, సమస్తప్రాణులకు దృష రూపమైనట్టియు ప్రకాశరూపమైనట్టియు, దేవతాస్థానరూపమైనట్టియు, జగద్రూపమైనట్టియు, సమస్తమునకు నాయుస్స్వరూపమైనట్టియు, సమస్తపాపముల నిరసింపుటకు కారణరూపమైనట్టియు, ప్రణవస్వరూపమగు గాయత్రిని, ఆవాహన జేయుచున్నాను, సపితృమణ్డలమధ్యవర్తినియగు సావిత్రిని, ఆవాహన జేయుచున్నాను. సర్వవ్యాపినియగు సరస్వతిని ఆవాహన జేయుచుంటి. గాయత్రీ ఛంద ఋషులను అనగా విశ్వామిత్ర మహర్షి మొదలగువారలను, సర్వసేవ్యమగు లక్ష్మీదేవిని

ఆవాహన చేయుచున్నాను. ఈ నామములన్నియు విరాట్పురుషశక్తియగు గాయత్రినిగూర్చియే చెప్పఁబడినవి

భా॥ ఓజోసి, అన్తరింద్రియశక్తిరసి, సహోసి, సర్వశత్రునిరసనశక్తిరూపాఽసి, వేగవతాం వేగరూపాసీతివా, బలమసి, సమస్తదార్ఢ్యరూపాసి, భ్రాజోసి, భ్రాజోదీప్తిః తద్రూపాఽసి, దేవానాం ధామ స్థానం యత్తన్నామాసి, ధామతేజః తద్రూపాసీతివా, విశ్వమసి విశతి సర్వత్రవిశ్వం విశప్రవేశనె, తద్రూపాసి, ప్రపఞ్చస్వరూపధారిణీత్యర్థః, విశ్వాయుః సర్వేషామాయుస్స్వరూపాసి సర్వమసి, స్రియతె సజాతీర్యైరితిసర్వం తద్రూపాసి సర్వాయుః సర్వజీవాన్తర్గత్రినీత్యర్థః - అభిభూః సర్వదోష పరిభవకారణ రూపాసి, ఓం ప్రణవస్వరూపాసి, తస్మాద్గాయన్తం మాంత్రాయస్వేతి, గాయత్రీంత్వామావాహయామి, హుతె, సవితృమణ్డలాన్తర్వర్తినీ సావిత్రీంత్వామావాహయామి. సర్వవ్యాపినీం సరస్వతీమావాహయామి, ఛందఋషీన్ ఛందః గాయత్ర్యాదీన్ ఋషీన్ విశ్వామిత్రాదిఋషీన్ ఆవాహయామి, శ్రియం శ్రియతెసర్వైరితిశ్రీః, శ్రీసేవాయాం శామావాహయామి.

మూలమ్. గాయత్ర్యాగాయత్రీ ఛన్దో విశ్వామిత్రఋషి
స్సవితాదేవతాఽగ్నిర్ముఖం బ్రహ్మ శిరో, విష్ణు
ర్హృదయగ్ం రుద్రశ్శిఖా,పృథివీయోనిః, ప్రాణాపాన

వ్యానోదానసమానా సప్రాణా శ్వేతవర్ణా సాఙ్ఖ్యా
యనగోత్రా గాయత్రీ చతుర్వింశత్యక్షరా త్రిపదా
షట్కుక్షిః పఞ్చశీర్షోపనయనే వినియోగః.

తా॥ గాయత్రీ మన్త్రమునకు, గాయత్రీఛందస్సు, ఋషి, విశ్వామిత్రఋషి దేవత, సూర్యుడు అగ్ని ముఖము శిరస్సు బ్రహ్మ హృదయము విష్ణువు. శిఖాస్థానము రుద్రుడు యోనిస్థానము పృథివి హృదయమునందుండు ప్రాణవాయువును మూలస్థానమునముండెడి అపానమును సర్వవ్యాపియగు, వ్యానవాయువును, కణ్ఠమునందు, ఉదానవాయువు, నాభియందు సమానము. ఇంక నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ, అను ఉపవాయువులతోగూడిన శ్వేతవర్ణముకలదై సాఙ్ఖ్యాయన గోత్రమందుద్భవించిన గాయత్రి సువర్ణఋషి పుత్రుడు సాఙ్ఖ్యాయనుడని॥ ఉపనిషత్ప్రమాణము॥ ఋగ్, యజు, సామ, అను మూడు వేదములు లేక స్వర్గ మర్త్యపాతాళములు మూడుపాదములు చతుర్దిక్కులు భూమి, ఆకాశము, నీరారుసు కుక్షిగా గలిగినట్టియు శివ, కేశవ, బ్రహ్మ, ఇంద్ర, ఆదిత్యులను పఞ్చశిరస్సులుగల గాయత్రీమన్త్రాధిష్ఠానదేవతను. బ్రాహ్మణాదుల కుపనయన కాలమునందు వినియోగము అనగా ఉపదేశము [illegible] గ్రహించదగినదని భావము.

తా॥ గా [illegible] ఋషి,
విశ్వామిత్రఋషి [illegible] యజ్ఞోపవీత

రూప స్తృతీయశ్చిత్రసేనకః జయసేనో విఘనసో విశ్వాకారసుతా అమీ త్యుపనిషత్ప్రామాణ్యాత్, అస్యాదిదేవతా, సవితా, సువతిప్రేరయతీతి సవితా, మూర్జ్ప్రేరణేముఖం, అగ్నిః అగ్నిముఖా వై దేవా ఇతిశ్రుతేః॥ శిరః బ్రహ్మ, విష్ణుః, గాయత్ర్యాఃహృదయం, శిఖా, రుద్రః రోదనంద్రావయ తీతిరుద్రః దుఃఖహరఇత్యర్థః పృథివీ, యోనిః, ఉత్పత్తిస్థానం, పృథివ్యా త్పృథివీ॥ ప్రాణాఽపానమితి, ప్రాణః హృదిస్థః, వాయుస్థానాధివాసో వా యురపానః, నాభిదేశస్థస్సమానః, ఉదానః కణ్ఠస్థవాయుః. సర్వసం చారీవాయుర్వ్యానః, సప్రాణానాగకూర్మకృకర దేవదత్త ధనంజయ యుక్తాయా దేవీసా శ్వేతవర్ణా, శుభ్రవర్ణా, సాఙ్ఖ్యాయనగోత్రా, సాఙ్ఖ్యా యనోభగవతస్సుపర్ణ ఋషేః పుత్రః తథా॥ ఉపసుపర్ణ, విశ్వజ్ఞ. పరిత సూరసేన, సాఙ్ఖ్యాయనాః పఞ్చ ఋషయో భగవతస్సుపర్ణఋషిపుత్రా ఇత్యుపనిషది॥ తథాదైవజ్ఞశ్చ, శ్లో॥ జ్ఞానశక్త్యాంతతోజాతా స్సుపర్ణ ఋషిపుంగవాదాదా వుపసుపర్ణశ్చవిశ్వజ్ఞః పరితస్తథా పఞ్చైతే సూరసేనశ్చ సాఙ్ఖ్యాయనఋషిస్తతః ఇతి॥ చతుర్వింశత్యక్షరా చతు ర్వింశత్పరిమితాని అక్షరాణి యస్యాస్సా, త్రీణిపదానియస్యాస్సా త్రిపదా త్రిలోకరూపాణి, ఋగ్యజుస్సామ రూపాణివా షట్కుక్షిః ప్రాగాది చతుర్దిశః భూదివౌచ అస్యాఃకుక్షిరితిభావః పఞ్చశిరా, శివ, కేశవ, బ్రహ్మేంద్రాదిత్యాః పఞ్చ అన్యథా [illegible] శిక్షా కల్పః నిరుక్తం జ్యోతిశ్శాస్త్రం ఛన్దా అస్యాశ్శి [illegible] శిరా శివకేశవాదియుతజగద్రూపిణీ [illegible]

శ్రీయజ్ఞోపయుజ్యఇత్యతఆహ ఉపనయనే వినియోగః ఉపనయనం నామ శ్రౌతసంస్కారవిశేషః తదాచార్యకర్తృకమాణవకనిష్ఠః॥ అష్టవర్షం బ్రాహ్మణముపనయీతేతి శ్రుతేః తథాదైవజ్ఞః॥ శ్లో॥ బ్రాహ్మణస్యాష్టమేబ్దేతు రాజ్ఞాం ద్వాదశవత్సరే వైశ్యానాం షోడశవర్షే కర్తవ్యం చోపనాయనమితి॥ తత్రైవ గాయత్ర్యా ఉపదేశార్హత్వాదుపనయనే వినియోగఇత్యుక్తం కేచిత్ ఉపసమీపేనయనమితిసమీపే సర్వకార్యప్రదర్శనమిదం నయనమిత్యర్థః జ్ఞానచక్షురితి భావః.

మూలమ్॥ ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి
ధియోయోనః ప్రచోదయాత్.

తా॥ అఖండానన్ద స్వరూపుడైనట్టియు సృష్టిస్థితి లయాధినాథుడై జగత్ప్రేరకుడైనట్టి యేపరబ్రహ్మము మాయొక్క హృత్పుండరీక స్థానమునందుండి, (అనగా జీవరూపుడై) అన్తఃకరణవృత్త్యాదుల ప్రకాశింపజేయుచుండెనో యట్టి పరాత్పరునియొక్క సర్వోత్కృష్టమగు తేజోమయ స్వరూపమును ధ్యానించుచున్నాము.

భా॥ దేవస్య దీవ్యతినందతీతిదేవః, దివ్క్రీడాదౌ అఖండానన్దస్వరూపఇత్యర్థః, తాదృశానన్దస్వరూపజ్ఞానార్థమిదంస్తోత్రమితి భావః॥ బ్రాహ్మణావివిదిషన్తి యజ్ఞేనదానేన తపసానాశకేనేతిశ్రుతేః, కిమనేనేతి, ఆనన్దం బ్రహ్మణో విద్వాన్నబిభేతికదాచనఇతిశ్రుతేశ్చ॥ తస్య, సవితుః- సువతి ప్రేరయతీతి సవితాసూక్ ప్రేరణే, తదానన్దస్వరూపస

సర్వప్రేరకత్వం యత్తతిచేత్, జీవరూపేణహృత్పుణ్డరీకే నివసన్నిత్య
ర్థః॥ యఇమావిశ్వా భువనాని జుహ్వదృషిర్హోతా నిషసాదాపితానః
స ఆశిషాద్రవిణ మిచ్ఛమానః పరమచ్ఛదోవర ఆవివేశ ఇతిశ్రుతేః॥

యో విశ్వకర్మాపరమేశ్వరః స్వయమేకయేవాసీత్ = స్వ
కీయమేవాద్వితీయం పారమార్థికస్వరూపమావృత్యాఽవరె, శరీరమధ్య
వర్తిని పుణ్డరీకస్థానె ఆవివేశజీవస్వరూపేణ ప్రవిష్టఇతి విద్యారణ్య
భాష్యే॥ తస్యభగవతోవిశ్వకర్మణః వరేణ్యం వరణీయం సర్వో
త్కృష్టమిత్యర్థః, భర్గః వృజనభర్జనాద్భర్గః, బ్రహ్మజోపాసె, సర్వ
పాపహరమిత్యర్థః, తత్తేజః, తత్త్వమసీతిమహా వాక్యానుసారమిత్యర్థః॥
ధీమహి, ధ్యాయేమహీతిప్రార్థనాయాం, లిఙ్, యః విరాడ్విశ్వకర్మా
త్రిమూర్త్యాత్మకః, శ్రు॥ విశ్వకర్మా మనసా యద్విహాయా ధాతా వి
ధాతాపరమోతసందృగితి।

విశ్వవిషయాణి సృష్టిస్థితిసంహారస్వరూపాణి కర్మాణియస్యాసౌ
విశ్వకర్మా, తస్యతేషుకర్మసు, తపఏవసాధనం, సత్యసంకల్పాదయః,
మన స్సంకల్పమాత్రేణ విశ్వకర్మాధాతా। విధాతా విహాయా ఇతి
చోద్యతె॥ సః, నః, అస్మాకం, ధియః, అన్తఃకరణవృత్తీః, ప్రచో
దయాత్, హృత్పుణ్డరీకస్థో విరాడస్మాక మన్తఃకరణవృత్త్యాదికం
ప్రకాశయతీత్యర్థః, తద్విరాజమానం ధ్యాయేమహీతి పూర్వేణా
న్వయః॥ తథాదైవజ్ఞోపి॥ శ్లో॥ విరాడ్రూపం హితేజస్తు తత్సర్వా
న్ప్రేరయత్యగః, తదేవప్రత్యహం ధ్యాయే త్సర్వకాలేష్వతన్ద్రితః॥

సోఽప్యన్యమనాభూత్వా ప్రణవంస్మర్తుమర్హతి అఉమాశ్చక్రమాత్ జ్ఞేయాభూర్భువస్సువస్సాక్షికాః॥ ఋగ్యజుస్సామ వేదేభ్యోభూర్భువస్సువసజ్ఞికాః గాయత్ర్యాఃపాదరూపేణ గృహీతా బ్రహ్మణాఃపురా॥ ఓంకారమాది గాయత్రీంత్రిభిర్వ్యాహృతిభిర్యుతాం। ఉభయోస్సంధ్యయోర్జప్త్వా వేదమూలఫలంలభేత్॥

**మూలమ్॥ ఓమాపోజ్యోతీరసోమృతంబ్రహ్మభూర్భువస్సువరోమ్**

తా॥ జలములు అనగా జలాధిష్ఠానదేవతయగువిష్ణువని భావము. జ్యోతిస్స్వరూపమగు సూర్యుండును, రసము, మధురాదిరసములు వీటి కాధారము భూమి, షడ్రసములును, భూజములవలన గలుగును గాన, రసాయనమగు భూమికధిపతియైన దేవేంద్రుడని భావము, అమృతము, అమృతస్వరూపుం డీశ్వరుడని తాత్పర్యము, ఈశ్వరునకు మృత్యుంజయనామముగలదుగాన, అమృతాధిష్ఠానదేవతయగు పరమేశ్వరుండని భావము, బ్రహ్మస్వరూపమును, భూర్భువస్సువ అను మూడువ్యాహృతులును ఓం గాయత్రికి శిరః [illegible] నోంకారమనితాత్పర్యము, అనగా ప్రణవమువలన ప[illegible]మూ[illegible]ను, (అర్థాంతరము) ఉదకను తేజస్సు షడ్రసములు, అమృతము, అనగా దేవాహారము. వేదము భూలోక మొద చతుర్దశలోకములు నుద్భవి[illegible]

భా॥ ఆపః తదధిష్ఠానదేవతా [illegible]ష్ణురిత్యర్థః. జ్యో[illegible]రూప[illegible]। రసఃరస్యతే ఆస్వాద్యతఇతిరసః, రస ఆస్వాద[illegible]రాది

